# బుద్ధ శతకం

ఆచార్య బోధి భాస్కర

ఆది బౌద్ధ మిషన్ పబ్లికేషన్స్
విజయవాడ - 2.



# అంకితం

శా॥ రాధాకృష్ణుఁడు తత్వవేత్త, జగదారాధ్యుండు, సర్వజ్ఞుఁడు
న్నాధారమ్ముఁ దత్వభేదములఁ దాఁ జాటించునట్టి యిలన్;
బోధానందగుణుండు 'జితాత్ముఁడు'ను సంబుద్ధుండునౌ గౌతమో
ద్బోధల్ గూర్చిన నాదు బుద్ధశతకంబు న్నందుకో పూజ్యుఁడా!

ఉ॥ ఆంధ్రుఁడవన్న హర్షము గదా యుపరాష్ట్రపతీ! కడింది; నే
నాంధ్రుఁడ, బోధి భాస్కరుఁడ, నాదిమ బౌద్ధమత ప్రచారకుం;
డాంధ్ర కవి ప్రపంచమున నాదర మొప్పఁగ బుద్ధ ధర్మము
న్నాంధ్రమునందుఁ గూర్చి తది యంకితమిచ్చెద నీకు నాంధ్రుఁడా!

మ॥ ఇది నా స్వార్థముఁ గోరి కాదు సుమి, నే నిద్ధారుణిం ధర్మముం
బదిలమ్ముం బొనరింపఁ గోరి యిపు డీభారమ్ముఁ జేపట్టితిన్;
బదివే లిచ్చినఁ దీరఁబోదు ధనలోభంబేని దారిద్ర్యమే
న్మది హర్షించెద నాదు కావ్యముఁ బరామర్శించిన న్మాన్యుఁడా!

ఆంధ్ర ప్రజానీకానికీ, తద్వారా ప్రపంచ ప్రజానీకానికీ

కైకలూరు తాలూకా వరహాపట్నం గ్రామస్థుల సంక్రాంతి

కానుక




బుద్ధిం సరణం గచ్ఛామి

ధమ్మం సరణం గచ్ఛామి

సంఘం సరణం గచ్ఛామి

# తొలిపలుకు

నాగరికతా పరిణామంలో ఉత్పత్తి పరికరాలనుబట్టి రాతియుగం, రాగి యుగం, లోహయుగం, యంత్రయుగం అనీ, సాంఘిక వ్యవస్థనుబట్టి గణతంత్రం (Primitive Communism), సూతధర్మం (Slavery), కుల ధర్మం (Feudalism), ధనతంత్రం (Capitalism). శ్రమతంత్రం ( Dictatorship of the Proletariat ), సమ తంత్రం (Communism), అనీ స్పష్టమైన దశలు కనుపిస్తున్నాయి. 'కులధర్మం' నుండి 'సమతంత్రం' వైపుకు ఆసియాకంటే యూరపే త్వరితగతిని పురోగమిస్తున్నా, 'గణతంత్రం' నుండి కులధర్మానికి పురోగమించటంలో ఆసియాదే ముందడుగయింది. ఇందులో నాయకత్వం భారతదేశమే వహించింది.

ఒక సంఘతంత్రంనుండి మరో సంఘతంత్రంలోకి మార్పు అవసరమయినప్పుడల్లా ఒక్కొక్క తత్వవేత్త బయలుదేరి సంఘాన్ని ముందుకు నడిపించినట్లు చరిత్ర చదివిన యెవరికయినా బోధపడుతుంది. అయితే ఒక్కొక్క తత్వవేత్త ముందు చూపుతో తన తక్షణ కర్తవ్యాన్నే గాక తరువాతి రాదగు మార్పులనుగూడా సూచించ గలుగుతాడు. బుద్ధుడీ తరగతికి చెందినవాడు.

ప్రపంచంలోకల్లా అతి ప్రాచీనమయిన నాగరికతల్లో ఒక దానికి భారతదేశం పుట్టినిల్లని అందరూ అంగీకరించినదే. అయితే రాజకీయంగా, సాంఘికంగా, ఆర్థికంగా గాని అర్థం గుర్తించ నిరాకరిస్తున్నారు. భారతదేశంలో క్రీస్తుకు పూర్వమే, ఆరవశతాబ్దానికే సూతధర్మం తుదముట్టి కులధర్మం కుదురుకొన్నది. బుద్ధుడు కులధర్మం మీద తిరుగుబాటు నడిపించాడు. ఆ తిరుగుబాటు తత్వం యీనాటికీ మన కుపయోగపడుతుందనే నమ్మకంతోనూ, బుద్ధుణ్ణి గురించి నేడు బహుధా ప్రచలితంగా ఉన్న అపోహలను తొలగించే ఉద్దేశంతోను, యీ శతకాన్ని మీ ముందుంచుతున్నాను. అయితే బుద్ధ ధర్మం ఈనాడు భారతంలో ఎంచేత కనుపించకుండా పోయిందంటే, కులధర్మాన్ని పునరుద్ధరింప పూనుకొన్న గుప్త రాజుల ప్రతీపచర్యలే కారణం అని గుర్తుంచుకోవాలి.

పాత శ్రేయస్సండా కొత్తలేదు. పాతసంతా మంచిదని నేనను. కాని పాతలో ఉన్న మంచిని కాదనటం తగదు. అయితే అసలు పాతచరిత్ర యేమిటో తెలిస్తేగదా, అందులో యేది మంచిదో తెలుసుకోనగలిగేది? అందుచేత పాత చరిత్రను ప్రజల కందించడానికి 'ఆది బౌద్ధ మిషను' పూనుకొన్నది. ఈ కృషిలో మీ చేయూత ఎంతైనా అవసరం. మిషన్ త్వరలో వెలువడబోయే "సంబుద్ధ" అనే మాసపత్రికకు మీ చందాలను ముందు పంపితే సంతోషం. వివరాలకోసం ఉత్సాహమున్నవారు ఆది బౌద్ధమిషన్, విజయవాడ-2 అడ్రసుకు వ్రాయ ప్రార్థన. సెలవు.

విజయవాడ.
16—1—1953

ఆచార్య బోధిభాస్కర,
ప్రతికర్త.

# బుద్ధశతకం

చ॥ ఎవనిగుఱించి గాథ లవి యెన్నియొ పుట్టి యిల న్స్రవించెనో,
యెవని స్మరించుచుందురిల 'ఏషియ'లోని ప్రజ ల్ముదంబునో,
నెవని మతమ్మె యింతవఱ 'కిండియ'కీర్తికిఁ బట్టుకొమ్మయై
యవనిఁ జరించె, నట్టి మహిమాన్వితు నిన్నుఁ దలంతు బుద్ధుఁడా

ఉ॥ 'బుద్ధచరిత్రఁ' గూర్చెఁ దగఁ బూజ్యుఁడు నాకుఁబితామహుండు తా
సిద్ధుఁడు 'చెళ్ళపిళ్ళ'; యిక శిష్యుఁడు 'కాటురి' మద్గురుండు తా
నిద్ధరఁ 'పింగళి'ం గలిసి యేర్పడ వ్రాయఁడె 'సంఘగాథ'; నే
బద్ధమొనర్తుఁ 'ధర్మమునుఁ' బండితమాన్యముగాఁగ బుద్ధుఁడా!

మ॥ ఒక వందన్రచియింతుఁ బద్యముల నా యొజ్జల్ఖలీ, భాస్కరా!
యిక నీకుం గవియన్న గిర్దొరులు తామీయుం బనేమోయన;
నొకసామ్రాట్టువు నీవు సర్వులును నేనోయీ యన న్సంపద
ల్నకిసింబాసి శ్రమించి కన్గొనిన సత్సారమ్ముపై బుద్ధుఁడా!

మ॥ కృతి నేఁ జేసెద నీదు ధర్మమిల నుత్కృష్టంబుగా జూపఁగన్;
గతియందుం గల దోషము ల్వెలికి లాగంజూడఁగా నేమి? నేఁ
బ్రతినం బూనితి భూమి నందరికిఁ ద్వత్ప్రజ్ఞ ప్రబోధింపగ,
స్వితముం దప్పిన భారతీయులనుఁ గవ్వింతుం బగఱ్ బుద్ధుఁడా!

మ॥ అనఁగాఁ గొందరు, వేఱువేరగు నెబ్భాగ్యమ్ములున్? కైత తా
విన సొంపుం గలిగింప నర్థమును భావింపంగఁ బోకుందురో?
మనలో మాటకు మూఢభక్తు లిల నామాట ప్రశంసింతురే?
తినువో నాల్కనుఁ దాటిపట్టెననె బంధింపన్నెటు ల్బుద్ధుఁడా!

చ॥ చెడుగుడుకూత నాకవిత, చెంగనము ల్పరవళ్లు ద్రొక్కెడి,
న్నడువఁగ నిచ్చగింపదిక నాతి స్వతంత్ర నటంచుఁ బర్విడున్,
దడుపొక యింతలేకఁ దగ ధర్మము జెప్ప నికేరికైనఁ, బో!
ఒడబడదింక నేముసలినో వరియింపఁగఁ దాను బుద్ధుఁడా !

ఉ॥ బుద్ధుని పేరు సెప్పఁగనె పొంగును లోకము శాంతివాంఛమై,
బుద్ధుని మాట విన్నవెసఁ బొంగును లోకము సామ్యవాదియై,
బుద్ధుని గాథ లెంచి మదిఁ బొంగును లోకము కీర్తి కాంక్షఁ; సం
బుద్ధుని పేరు నెత్తఁగఁ గుబుద్ధులు క్రుంగెవంత బుద్ధుడా !

ఉ॥ రక్షణ సేయఁగాఁ బ్రజల రాజ్యము వీడి, శ్రమంబు సైచి, సీ!
భిక్షువుఁ బాత్రఁ జేతనిడి, భీతిని వీడి, పరిభ్రమించి, యా
మోక్షము మోక్షమంచుఁ గడు మోసము సేసెడి మూకనంతటి
న్నిక్షణఁ జేసిఁ, యెందరినో శీలమునం దుసిఁగొల్పి బుద్ధుఁడా !

మ॥ లిపియే కాసఁగరాని కాలమునఁ బాళీభాష నీ ధర్మము
న్విపులమ్ము న్బొనరించి, నల్దెసలకు న్బోఁబంపి నీ శిష్యుల
న్విపినమ్ము ల్నగరమ్ముల న్నొకటిగా వేవేఁ బ్రచారించి, నీ
రిపు సంఘమ్ములను న్ద్రెగించి, జయభేరి న్వేసితో బుద్ధుఁ

శా॥ దండంబుం ధరియింపరే ఋషులు నిద్ధామంబుఁ బాలింపఁ, గో
దండంబు న్వెసఁబూని రాఘవుఁడు తా దండింపఁడే రాము, బ్ర
హ్మాండంబుం దగ మాపఁడే హాలముచే నా యాదవుం; డౌర! నీ
యండం జేరిన సంఘమేకదనె నీ యుణ్వాస్త్రమో బుద్ధుఁడా !

ఉ॥ దేవుఁడ నంచొకండు, మరి దేవుని పుత్రుఁడ నంచు నొక్కఁడున్,
దేవునిదూత నంచొరుఁడుఁ జెప్పఁడె ధామము వెంజకిమ్మగా!
నీ విట ధర్మచక్రమును నిల్పఁగ దేవతలందరు న్వెసన్
బ్రోవయి మ్రొక్కరేఁ భువినిఁ బ్రోవుమటంచను తాము బుద్ధుఁడా!

చ॥ భువి నిపుడున్న పెద్దమతము ల్పరికింపఁగ మూఁడె; యందును
న్నివులఁ బురాతనమ్మయి రహించును నీ మతి; మద్విశాఖలై
యవని ననాత్మవాదమున నాదట ముంచఁగ, హిందువుల్ భళీ!
యువిదలమాడ్కి నీవు నొక యుజ్వలదేవత వంద్రు బుద్ధుఁడా!

చ॥ మతములటన్న మూఢు లనుమాత్రము యోచన లేక దేవుని
స్మతము భజించుచుండుటయె సారమనం దలపోతు రీ యిలన్,
గత మది యేమొ చౌర్యమును ఖండనఁ జేయుఁగ, నాడు దాసికిన్
బతి యొక దైవమం చనవి పాతము సెప్పఁగ నేల? బుద్ధుఁడా!

చ॥ మతము లనన్నియుం గలిగె మానవసంతతి నుద్ధరింప, నే
వితమునఁ గల్గె నన్ని మతభేదములంచునుఁ బల్కరే భువి
న్మతి యొకయింత లేకఁ దగ మాటలయర్థ మెఱుంగకన్ భళీ!
మతమును వాదమున్ 'ఇజము' మాటల భేదము కాదె బుద్ధుఁడా!

మ॥ కనమే కాంగ్రెసు కమ్యునిస్టులన నికారలమ్మునన్ వాదము
ల్వినమే పెక్కులు; లక్ష్యభేదము లవి విస్పష్టిఁ జరింపంగఁ దా,
మనగాఁ బోడియె యజ్ఞతన్మనిగి నే నన్ని సమమ్మంచు; లే
దనగాఁ జెల్లునె భేదము న్మతములం దావంతయు న్బుద్ధుఁడా!

॥ ఇలఁగల వెన్నియో మతములేర్పడ మానవసంతతిన్, భళీ!
కల మతముల్సమస్తమును గాదిలి ప్రొక్కఁగ దేవతాళి; ని
ర్మల మతు లాదిబౌద్ధులును మాన్యులు సింహళవాసు లెన్నఁడున్
దలఁపరు నిన్ను దేవుఁడవు, ధర్మమునే శరణంద్రు బుద్ధుఁడా !

ఉ॥ చారిక జీవులయ్యుఁ దొలిసారి 'లిపిం' గనుఁగొన్న చైనో-
నారయుఁ 'జీన'యందుఁ దొలి యచ్చుమరం త్రముకూర్చుప్రజ్ఞతోఁ,
బారము ముట్టఁ దర్కమును బదముఁ జేసిన బుద్ధిమత్తనే
పారిన బౌద్ధులన్ భువిని భాసిల జేసితివీవ బుద్ధుఁడా !

ఉ॥ క్రీస్తుకుఁ బూర్వమీ విచటఁ గీర్తనసేయఁగ జ్ఞానమార్గము
విస్తృతమయ్యెఁ, బో, కళలు విద్యలవెన్నియొ భౌతికమ్ములై;
ప్రస్తుతిసేయఁ దా యవనభాస్కరు 'ఆలికుజాండ' రింకను
న్విస్తృతముల్ గొనర్చి రటఁ బ్రీతిని గ్రీకులు వాని బుద్ధుఁడా!

మ॥ 'దయ లెక్కి' క్సైన దబ్బుసొమ్ముగును, పో, డంబంబుగాఁ బల్కఁగ?
న్నియమింపం దొలి నీవు, సోక్రటిసు దాసిం గ్రీసులో నేర్పఁడే !
పయనించె న్నది రోముకుం, బిదప నా పాశ్చాత్య దేశమ్ములు
న్నియమం బొప్పఁ బఠించినంతఁ జెడునే నీ ధర్మమో బుద్ధుఁడా!

చ॥ అయినను గ్రీసునందు జను లంతకు మున్ను మలంచి బొమ్మల
న్నియతినిఁ బూజసేయు టది నీతియటంచుఁ దలంచి కొల్వఁగా,
నియమమువీడి బ్రాహ్మణులు నిల్పరె యిచ్చట నీదు బొమ్మల?
నయమున బ్రాకె బొమ్మలిక రాజ్యములన్నిట నిల్చె బుద్ధుఁడా!

ఉ॥ క్రీస్తను యూదొకండు పరికించి యిలం గల బొమ్మపూజఁ, దా
'నాస్తి గదోయి! దేవునికి నామము, రూప'మనంగ నాతనిన్
గస్సిపి ముంచి, కంబమునఁ గట్టియు, యూదులు గండుమూర్ఖులై,
మస్తము ముళ్ళతీగ నిడి మాయురె! చంపిరిగాదె బుద్ధుఁడా!

ఉ॥ క్రీస్తునె దేవుఁడంచు భువిఁ గీర్తిపుడఁ బూజలు సేయఁగా బ్రజ,
ల్మస్తకము న్నెగ న్నరిక మాహాత్మ్యముఁ గూల్చెఁడె తా మహమ్మద;
పుస్తక తుర్కబాధ లవి ద్రోలఁగ గ్రీకుల రోమునకు, న్నటన్
గ్రైస్తవ పోపు చేయు చెడుకర్మలఁ ద్రుంపరె వారు బుద్ధుఁడా!

ఉ॥ దేవుఁడనంగ సర్వమొక తీయుతొఁ డన్నను, నీవు చెప్పవే
"బ్రాహ్మణుఁ జూపఁగల్గు దిక్కుఁ దోప్పడఁజాలను జ్ఞానసిద్ధికై,
నీవయి దారియందు పెసల్వెఁ దొలంగు నవిద్య" యంచు, న
బ్భావము వీడి బొమ్మలకు భక్తిఁ జూప ఫలంబె? బుద్ధుఁడా!

ఉ॥ దేవుఁడ వంచు నిన్గొలువ దేశము లన్నియొ, యీసుచే నిటన్
బ్రోవయి బ్రాహ్మణోత్తములు బుద్ధుఁడు వేరొకఁడంచుఁ బల్కరే?
నీవొక రాజువోట నిల నీమత మింతగఁ బ్రాకెనంట; యూ
రా! విను, రామకృష్ణు లిల రాజులుగారొకొ తాము బుద్ధుఁడా!

ఉ॥ కావ్యములన్ని నీ వెనుకఁ గాదె రచించిరి సంస్కృతమ్మునన్?
దివ్యము నాది కావ్యమన దీటగు నందొక రాముగాథయే;
భవ్యమనంగఁ దత్కథను భావనఁ జేసెఁ గిరాతుఁ డొండనన్
భావ్యమె రాముఁడం చొకఁడు భాసిలె నీయిలనంట? బుద్ధుఁడా!

ఉ॥ "పంచమవేదమ న్నిరుదు భారతకావ్యమునంద రూఢియౌ,
నంచితరీతిఁ జెప్పినది యాదిమ భారత సంవిధానముల్;
సంచితమయ్యె నార్యుల ప్రశస్తతరమ్మగు పూర్వజీవితం
బెంచఁగ వేదమం దనుచు నిమ్ముగఁ బండితులంద్రు బుద్ధుఁడా!

మ॥ ఒకవోనైన నధర్వ వేదమునె నీవొక్కింతయు న్మెత్తవే
లోకా? నీ వైరులు సైతముం దడవఁగా నుంకింపరే చర్చలన్?
ఇక నీ పిమ్మటఁ బుట్టె భారతమునం చేఁ జెప్పఁగాఁ బోలదో?
యిక వాదమ్మది యేల? వేదములు మూఁడేగానె మున్ బుద్ధుఁడా!

మ॥ కలరో లేరో యెఱుంగఁజాల మిపుడా కాలమ్మునం గృష్ణుఁడు
న్బలరాముం; డిక నీవు దక్కఁ గలఁడే భావింపఁగాఁ దేవుఁడుల్?
బలుకం జొచ్చిరి నీవ లేవనుచు దుర్భాష ల్మహాయానుల
న్మలినాత్మ ల్గుమిఁ గూడి కొందరది నీ మార్గమ్మె? సీ! బుద్ధుఁడా!

ఉ॥ ఆర్గురు బుద్ధులుండిరని యంటివి నీవిల నీకు మున్న, వా
రార్గురు నీదు ధర్మమునె యాడిట నిల్పుట నిశ్చయిల్, భళీ!
యార్గురటన్న నీమ మరయం గనరాదని యంటిగాదె! నీ
వార్గురి నేడుఁ జేసితివి యాపయి నెందను లేరు? బుద్ధుఁడా!

ఉ॥ హిందువులన్న పేరు తొలి సీనముగాఁ దలఁపోయ భారతం,
బంద మటంచు నెంచి యిపు డందరు హిందువులే యటంద్రు, సీ!
మందమతు ల్యథార్థమును మహాత్మ్యముచేత నెఱుంగఁజాల, రీ
వెంనును హిందుదేశమని యెన్నఁడుఁ బల్కవుగాదె బుద్ధుఁడా!

శా॥ ఉన్నాఁ డొక్కఁడు మామహేశ్వరుఁ డనన్నుద్ధారముం జేయఁగా;
విన్నాణమ్ముగ వెల్కిఁదీసి యొక ఋగ్వేదోక్తమంత్రమ్ముఁ దా
మిన్నుల్ముట్టఁగ నార్చుచుండె నిట దుర్మేధన్ బ్రయోగించి, యో
యన్నా, హిందువులన్న పేరు మనదే యంచున్, భళీ! బుద్ధుఁడా!

ఉ॥ తాతకు నేర్పఁగాఁ దరమె దగ్గు; లిలన్నినుమించి యేరు మా
ప్రాత చరిత్రఁగూర్చి తగఁ బారము ముట్టఁగఁ జెప్పఁగల్గుఁ బో!
సూతుఁడు శౌనకుండు మరి సోదెకునైననుఁ గానరారు నీ
ఘాతముల న్భళీ! త్రిపిటకమ్ముల నెచ్చటనేని బుద్ధుఁడా!

చ॥ అయిననుఁ జెప్పుచుందు రిట నంతకు మున్నుఁగలట్టి గాథల
న్వయినము గాఁగ వ్యాసుఁడల వ్రాసెనటంచును; పేరులన్ననో
నయముగు నేటి వ్రాతలఁ గన న్నగు నట్టివి; నమ్మరేరు న
న్భయమున నీతిఁ జెప్పు మన ప్రాతపురాణములంద్రు బుద్ధుఁడా!

చ॥ కులములు గోత్రముల్గలవె! కుట్రయనందగుఁగాక, జెల్లునే
కలియుగమందు ద్వాపరపుఁ గర్మయు ధర్మము? కృష్ణుఁ బ్రాభవ
మ్ముల నదియెంత జెప్పినను నేమి ఫలం, బది త్రేతనుండనే?
యలవియె యేరికైన నిను నంటగ నీ యుగమందు? బుద్ధుఁడా!

మ॥ కులము న్గోత్రము లంచు దేశ మరరే! ఘోరమ్ముగాఁ జీలదే,
బలమున్ గోల్పడి ఛిన్నభిన్నమయి పల్బాధల్భరింపం బ్రజల్?
చలమున్వీడి చరిత్ర సర్వమును వే సంధించి చూడంగ, జా
తు లవెన్నో యిటవచ్చి కూడవె? నదీతుల్యంబుగా బుద్ధుఁడా!

చ॥ కులము లటన్న హిందువులు గొప్పగఁ జూతురు; మాంసరక్తము
ల్మలమినుమూత్రముల్ జెమట మానిసులన్నమకూఁగదా! యికన్
గలదె నిజమ్ము నీదు గుణకర్మలఁ బోలును నీ కులమ్మనన్?
ఇల గుణకర్మము ల్పుటక నేరకెఁ గల్గవు గాదె బుద్ధుఁడా!

ఉ॥ ద్రావిడు లార్యులు స్వపదంబును మీదఁ గుషాణు లాపయి
న్నాభవనసేయ నెందరిట బల్మిమెయి న్వడి నెత్తివచ్చిరో!
యేవ జనంపఁబల్కుఁ దగ దేరిక్నైన "మహమ్మదీయులే
పావన భారతీయులకు బద్ధవిరోధు"లటంచు బుద్ధుఁడా!

చ॥ ఎఱిఁగి యెఱింగి నీవయిసి నెన్ని యబద్ధము లల్లినం ధరన్
దరమగు నెల్లు దబ్బరలఁ దథ్యము సేయఁగ? "సర్వ దుఃఖ సం
హారణముదక్కఁ ధర్మమున నన్యము సున్న మహాత్వమొద్దియే,
నరమర లేని సత్యమిది"యంచు వచించితిగాదె బుద్ధుఁడా!

మ॥ అరెరే! రాజులపంచఁజేరి యతిహేయంపుం బనుల్సేయఁగా
వారకొన్నట్టి యధర్ములెంపరో కడు ద్రోహమ్ము నోసంచుఁ దా
మరయ న్జాలకఁ దృష్ణచేఁ, దమకుఁ దామాచార్యులై, బౌద్ధుల
న్బిరుదుంబూని నటింపరే యిలను నీపేరన్ గటా! బుద్ధుఁడా!

ఉ॥ సారమొకింతలేసి పదజాలము నూదుచు నిల్లువీడి యే
గారడి విద్యనో కఱచి కాలముఁ బుచ్చెదు వారిచేఁ బ్రజ
ఘోరముగాఁ బురాకృతపుఁ గోతినిఁ గూలఁగ నుద్ధరింపవే
'కారణధర్మము' న్నరపి కార్యమునం బురిఁగొల్పి బుద్ధుఁడా!

ఉ॥ కష్టముఁ జేయకే ఫలముఁ గల్గఁగఁ బోదిల నేరికిం జుమీ!
దుష్టముగానఁ దృష్ణ యిక దుఃఖము నే సమకూర్చు నిబ్భువిన్;
దుష్టినిఁ జెంద నభ్యుదయ మార్గుల వాదము కాదె? నీవికన్
దుష్టికిఁ దృష్ణకు న్నడిమి మార్గమునుఁ జూపితి కాదె బుద్ధుఁడా!

మ॥ జైనులహింస యంచుఁ గడు ఛాందసులై తప మాచరింపఁగా
దానఁ దొలంగ బన్నమును దైన్యము తృష్ణను వీడకుంటివే!
హీనమతుల్ జరిత్రల నహింసయె నీదగు ధర్మమంచు నీ
ధ్యానను వీడి వ్రాసిరిట సందడి మోసము జేయ బుద్ధుఁడా!

ఉ॥ మూఢులుచేరి కొందరిల "బుద్ధుఁ డహింసను బోధఁ జేయఁగా
గాఢ నిశీధ మంతటనుఁ గ్రమ్మకొనెన్వడి. భారతావని
న్మూఢ మహాత్ములియు లిక బూడిదఁ జేసి" రటంచుఁ బల్కరే?
రూఢ నెఱుంగకుండఁ దెగ రోషముఁ జూపఁగనేమి! బుద్ధుఁడా!

మ॥ అనవే తొల్లి యజాతశత్రుఁ డొగి నన్యాయమ్ముగాఁ గోసలా
వనిపై నెత్తి ప్రసేనజిత్తు నని కాహ్వానించి యోడింపఁగా,
వినఁగా శిష్యులు 'వాఁడు పాపి' యని? నిర్వీర్యంబు నీ ధర్మ మం
చను వారిద్ది యెఱుంగఁగాఁదగును మర్యాద న్వెసన్బుద్ధుఁడా!

చ॥ తిరిగి ప్రసేనజిత్తు తగఁదీయఁగ దెబ్బకు దెబ్బ, నీవు న
త్తరినిఁ బ్రశంసఁ జేసితివి ధర్మజయంబని యాతనిందగ;
న్మరియఁగనేమి దుష్టుఁడిల ముందటి గెల్పున? మీఁదఁ గల్గు దు
ర్భరమగు నోటమింగని పరాభవ మందఁడె తాను బుద్ధుఁడా!

శా॥ గాంధీగారొక బుద్ధుఁడే యనుచుఁ బల్కన్వింటి నే; నట్టులే
యంధుం డొక్కరుఁ డాకసమ్మున భళీ! యందంచుఁ దాఁ దిగ్గుచు
న్సంధింపం దన ఘ్రాణముం భువిఁ బడెన్ 'సంపంగి' యన్నిట్టి, తి
ద్గంధంబుం గని మూర్ఛిలెం జగమునం గాదందుమే బుద్ధుఁడా !

శా॥ హింసాహింస లటంచుఁ బల్కుదు కడు స్వాయమ్ముగాఁ బల్కుచున్
ధ్వంసంబున్నొనరింత్రు ధర్మము నవిద్య న్మున్గటం జేసి, యే
హింసం జేయనివాఁ డెవండొ యిలపై? హింసింపరే జీవుల
న్మాంసంబుల్ బలు శోకము ల్బడయ నీమంచు ల్భళీ! బుద్ధుఁడా!

చ॥ అది యటు లుండనిచ్చినను నాపఁదరింబ క్షణక్షణమ్ము దా
మదియును నిద్రియుం బడయ నాదట నిట్టటు దిగ్గినప్పుడే
పదికినిమించు లక్షలనొ పాదములం జెడఁద్రొక్కు జీవులన్ ?
'జదివినవానికన్న నిక జాకలి మే'లననిట్లు బుద్ధుఁడా !

మ॥ "ఎనయో హింసను జేయుటద్ది యిల నేయో వాదము ల్నచ్చినన్?"
అనరే కొందరు హీనబుద్ధి, కడుఁ దృష్ణాబద్ధులై యుండియు
న్జనునే లోకుల తప్పుఁ బట్టగను లజ్జన్వీడి సీ! నవ్వగా
వినమే బెజ్జముఁ గల్గియుం బగడ గుర్వొందం భళీ! బుద్ధుఁడా !

ఉ॥ హింసయనంగఁ దృష్ణఁ గడు హెచ్చునటు ల్బనిఁ జేయు కర్మయే;
హింసయనంగ మానవుల హీనముగాఁ దలపోయుటే సుమీ !
హింసయనంగ నజ్ఞతను హెచ్చఁగఁ జేయు మతప్రబోధనే;
హింసయనంగఁ దోటి బలహీనుల దోచుటగాదె బుద్ధుఁడా !

ఉ॥ సేద్యముఁ జేయువారికిలఁ జేలను విత్తన మీయఁగావలెఁ;
విద్యలఁ గల్గువారికయి వేతనముల్ సమకూర్పఁగాఁదగున్;
హృద్యముగాఁగఁ బామరుల నీయిల జ్ఞానులఁ జేయఁగొప్పెడిన్;
విద్యయు ఖాద్యముం దఱుగ పేదదు దుఃఖమొకింత బుద్ధుఁడా!

శా॥ వ్యాయామమ్మది చేయకుండ బలియ, న్వ్యాసంగ్రము పో నైన్య; లే
యాయాసమ్మును లేకయున్న సిసీ, యానామిరా! యంద్రిలన్,
నే యత్నమ్మునుఁ జేయకున్నఁ గలదే ; ర్వ్యాణ సౌఖ్య? మ్మికన్
గాయాకల్పముఁ జేయ జ్ఞానమెటులన్ గాంచంగనౌ బుద్ధుఁడా?

ఉ॥ కుక్కనుఁ జావబాదినను కొంపల దూరుచునుండు పొట్టకై
ముక్కవకోడ; లగ్గది యమానుషమూటను; మానవుండికన్
దక్కిన జీవరాశివలె ధర్మము మర్వఁగఁ జెల్లునే భువి?
న్మక్కునఁ దుమ్మివేయ స్మృతి బుద్ధియెటు ల్వికసించు? బుద్ధుఁడా!

ఉ॥ మూఢమతంబ్రు ధర్మమును కొందరు బోధలు, పామరుల్గదే!
మూఢతఁ బెంచుఁగాక, మరి ముక్కను మూసికొనంగ నేమగున్?
గాఢసమాధియందుఁ గడుఁ గాఢముగాఁ దలపోయుటం గదా
రూఢిగ ధర్మమార్గము ప్రరూపణమయ్యెను నెంచ బుద్ధుఁడా!

ఉ॥ బట్టకుఁ బొట్టకై భువినిఁ బాటది తప్పదు; భిక్షమెత్తుటో,
మట్టముఁ జేసి భూమినిక మానుగ సేద్యముఁ జేయుటో తగున్;
గొట్టుట దొక్కటే తరుగు కూటికి భిక్షము నెత్తఁగా నిటన్,
గుట్టుగ జీవికం గనుపఁ గోరినభూమియె లేదు బుద్ధుఁడా!

ఉ॥ భోగముల న్మునింగి కడు పొంపిరివోఁ బతనమ్ము తప్పునే?
రాగముఁ బెంచు, సర్వమును రావలె నా కనిపించు, నంతఁ దా
రాఁగల దొక్క దుఃఖ, మిక రాలఁగఁ బోదొక రవ్వయేని, పో
భోగమువంటి శత్రువిలఁ బోల్పఁగ లే దొకటేని బుద్ధుఁడా!

ఉ॥ ధీరుఁ డిలం గలట్టి యపథు ల్గురుతించి మెలంగుచుండు, పో
భూరి గుణాఢ్యుఁ డొంటరిక మూఢునిమాడ్కి భయంపడండు తా
నేరికి, సంకెల ల్గలుగ నిప్పవి కొయ్యవి, యంతకంటెనున్
ఘోరముగాఁ దలంచు దన కుండలము ల్సతిఁ బుత్రు బుద్ధుఁడా!

ఉ॥ సన్యాసు ల్భువి నిప్పు డిల్లువిడి కాషాయమ్ము మైఁ దాల్చియున్,
అన్యాయంబుగ విత్తముఁ బడయుఁగా నందందుఁ గారాడుచున్,
అన్యుల్ జేయు పరిశ్రమం దమకునై యాశింప రే? కాక, పో
శూన్యమ్మౌ పరమాత్మఁ గోరి యెవఁడే న్మెప్పించునే? బుద్ధుఁడా!

శా॥ సన్యాసంబన శక్తిమంతుల వృథా సాకంగఁ బోకుంటయో,
సన్యాసంబన స్వార్థదృష్టి నిల దుస్సంపాదన న్మానుటో,
సన్యాసంబన సంఘసేవకయి సత్సాంగత్యముఁ జేయుటో,
సన్యాసంబన సర్వుల న్సమముగాఁ జాటించుటో బుద్ధుఁడా!

ఉ॥ భావములెన్నియో భువినిఁ బైకొని మానవులన్ గలంచు, నా
భావములందుఁ గొన్నియె స్వభావము లైచను, నందునున్ భళీ!
భావనసేయుఁ దగ్గ వొకపాలయి యుండును, వానిలో మముం
బ్రోవఁగఁ జాలునెన్ని? యవి బుద్ధినిఁ గాదె జనించు బుద్ధుఁడా!

ఉ॥ ఒంటరిపాటు మేలిలను నోజము తాఁ జెడకుండ నుంటకై,
తొంటరి స్నేహమెల్లఁ జెడు క్రోధవల కీడ్చుటకే యగుం జుమీ?
యొంటిగ యోచన న్సలుప నొప్పును గాకొక మూర్ఖసం ధరన్
జంటగఁ జేసికొన్నఁగల శక్తియు నాశమునొందు బుద్ధుఁడా!

ఉ॥ హేతువులేని కార్యమును, శ్రేయము కానిది స్వార్థచింతయున్,
బూతము కాని పుణ్యమును, పుత్రులఁ గూర్చిన లోకసేవయున్,
శీతము లేని చందనముఁ, జిత్తములంబున శాంతిలాభమున్,
బోతును వీడు పెంటియును భూమి నెటన్ గనరావు బుద్ధుఁడా!

మ॥ మనసే మూలము శోకమంతటికి; ధర్మంబులధర్మంగల్గ నా
మనసే కారణ, మొందు కాదు సుమీ! కామంబు ల్మహా దబ్బ ధ్యహా
మ్మనఁగాఁ జెల్గునవన్ని భావములె, ప్రవ్యంబందు లేదొక్కఁడు
న్మనవే పేరులు వేయి పుట్టగొడుగుల్మాడ్కిం ధరన్ బుద్ధుఁడా!

చ॥ మనమున కల్మషం బునిచి మాటల నాడిన దుఃఖమింకఁ దా
ననయము వెంటనంటు భువి నాదట స్వార్థము నామముం బలెన్,
ఎనయగు దుఃఖమంతమున నెగ్గగు చేష్టలఁ జేయ నేరికిన్
గనరథ చక్రము ల్లాయము కాళ్ళను వీడనియట్లు బుద్ధుఁడా!

శా॥ ఆకాశంబున రెక్కలన్నెగురనీ, యబ్ధిన్మునుంగంగనీ,
యేకాంతంగల కొండ గహ్వరమునందే మూలనొండాగనీ,
ఛీ, కోపంబున నైన నొక్క చెడుఁదాఁ జేయంగ నేవారికిన్,
'లా కేత్వమ్ముననుదాకుకొమ్మ' నరయన్ లాభమ్ములన్ బుద్ధుఁడా!

ఉ॥ తప్పది చేయుచుండుటయు దాసుడనంటయు మానవాళికి
నొప్పునె? చేయరానిపని కొడ్డినఁ దప్పునె దుష్ఫలంబు తాఁ?
జెప్పుము బ్రహ్మయైన నిలఁజేసిన తప్పును ద్రుంపఁగల్గునే?
చొప్పది తప్పినం ఘటము సొట్టనుఁ దీయఁగనౌనె? బుద్ధుఁడా!

శా॥ ఈలోకమ్మున శిక్ష తప్పదన నేనేదోషముం జేసిన
న్నాలోకమ్ములఁ బోడ నేమిపనియో? ఆమెట్ట వేదాంతులు
న్నాలోక్యమ్మునుఁ గోరి చేయు తపమాశంజంపునే? యింక వా
రే లోకమ్మున కేగినం దొలఁగునే యీదుఃఖమో? బుద్ధుఁడా!

శా॥ ఆమాటన్నను ముక్కుఁబట్టుకొనఁగా నాయూప్రబుద్ధు ల్వెస
న్నామీదంబడ జూతు 'రీయిలను నానారీతులన్ బల్వురే
మేమో చేసియు శిక్షలేకఁగను హాయింబొంది జీవింతురం'
చే, మందుస్నికే? ధర్మసూక్ష్మ మదె యంచే జెప్పెదఁ న్బుద్ధుఁడా!

ఉ॥ చిత్తమలంబు పో జనులుచేసెడి దాన మనర్థకమ్మగుగాఁ;
బాత్రముఁ జేతఁబట్టుకొని బొంగురుపోవఁగ గొంతుకన్ దగన్
జెత్తది రేగిపోవ రొదజేయఁగ నేమిఫలంబు గల్గుఁ? దాఁ
జిత్తము మాత్రమేదొ యొక చెత్తపయి న్నిలుపంగ బుద్ధుఁడా!

ఉ॥ ఈయిలఁగల్గు భాగ్యముల నెల్లనుఁ గోరి దురాశచే జను
ల్రేయిబవ ల్శ్రమించి పలురీతులఁ గ్రిందును మీదు నెంచుచున్
బోయెదు దానికై మిగులఁ బొక్కుచుఁ బోరుచుఁ మీఁదటం భళీ!
వేయి శుభమ్ములున్న నొకవీసముఁ గానరు కాదె బుద్ధుఁడా!

శా॥ నేనంచు న్నొక గోడఁ గట్టుకొని, యానే నన్న దే శాశ్వతం
బౌనంచున్ గడు భ్రాంతిఁ జెంది, మిపుల న్నారాటముం బొంద, వా
యానంద మ్మొకొ మాయమై చనఁగ, నాయా దుఃఖభారమ్ముచేఁ
గానంజాలను 'సంఘ ధర్మము' నిసీ! కాసంతయున్ బుద్ధుఁడా!

శా॥ నేను న్నేనని నిక్కటేలనో కదా! నేనన్న నేమో తగ
న్నీ నాయొజ్జలు తేల్చి చెప్పఁగలరే? నీకంటె వేరన్న వి
జ్ఞానమ్మొక్కఁడు దక్కనింకఁగలదే జ్ఞాతమ్మునో భేద మా
పై నాకున్మరి నీకుఁ బిండమున రూపంబందునన్? బుద్ధుఁడా!

శా॥ నీవు న్నేనను తారతమ్యమె కదా, నీవన్న విన్నాణ మ
న్నాఖన, మ్మద్ది యవిద్యఁగాదె బలియు; న్నెబ్బపై నిగారింపులన్
జావంబోవ దదెప్డు; దుష్టముగు నే సాంగత్యము న్వీడి, యే
వేషోగ్రాం తెమకోర్కెల న్వదలి జీవింప న్వలె న్బుద్ధుఁడా!

ఉ॥ ఆత్మయనంగ సంస్కృతమునందున నేనను మాటకు న్నము;
మ్మాత్మ పదార్థమొండు కలదా, యెటనైనను రూపవంతమై?
యాత్మకె యర్థమెద్దియును నైన స్ఫురింపని యప్పుడింక వి
శ్వాత్మయు దేడ? నర్థమును వాక్కును వే ఱటులౌను? బుద్ధుఁడా!

ఉ॥ 'ఏ' నన నొక్క భావమన నెట్లది నిత్యమగు? న్నిరంతర
మ్మేననుచు న్మనుష్యుఁడిల నెన్నియొమారులు పల్కఁగాదె? యా
నేను లవన్నియు న్నొకటె? నేనన: రూపమొ, వేదనో, సువి
జ్ఞానమొ, సంజ్ఞయో, మరియు సంస్కృతియో యగుచుండు బుద్ధుఁడా!

శా॥ ఏనే లేనపుడింక నాదియనఁగా నేమున్నదో యిచ్చటన్ ?
దానిన్ దీపనిఁగోరి, యత్నమున సద్దాని న్నొసందెచ్చి, యా
పైనం దానిని రక్షసేయుకొంటకై పాట్లెన్నియో సైచియున్,
బోనీకుండఁగ నాపనెట్లు ? కడుదుర్బోధమ్ము, సూ బుద్ధుఁడా !

ఉ॥ స్కంధము లైదును న్నరయఁ జాల ననిత్యములౌటఁ జేతఁ ద
ద్బంధము లూడఁ డున్న గుహాబాధల నన్నిటిఁ బారఁద్రోలనే;
సంధనము ల్గొ తాశనున కీవలకు న్వెస లాగివేయఁగా
సంఘుఁడుగాడె తా ననిమిషాళికి నగ్రణియయ్యె బుద్ధుఁడా !

శా॥ 'నేనే' లేదఁట కాదె, నీవు చెప్పుడు న్నే నన్నమాట న్వశీ !
తేనేలే చెటనే చర్చలఁ; గడుం దీవ్రమ్ముగా పెట్టులం
దైనన్ 'బల్కు తథాగతుం'డనుచు రుద్ధాత్ముఁడవై నీమమున్
బోనీకే గుదిఁగుచ్చియుంటివిట నీ బోధ్యంగము ల్బుద్ధుఁడా !

మ॥ తనకై కొంచె పరార్థమైన నొకటే, ధర్మమ్ముఁ దాఁదప్పి వే
నొనగూడన్వలె భాగ్యభోగ్యములు తా, మూరన్వలెన్ సౌఖ్యము,
ల్ధనముం ధాన్యముఁ గట్టఁబెట్టఁ గొడు కాధార మ్మగుంగాత నా
కనుచున్ గోరెదవందు ? వారిద యగునన్నర్థ్ఘత్వమో బుద్ధుఁడా !

శా॥ నా పెండ్లాముకు నల్లపూసయినఁ గాన న్నాఁడె యన్ జింతయు,
న్నా పుత్రుల్ని రుపేదలయిన నెటుల న్నాపేరు రాణించెడి,
న్నా పెట్టిల్లొడి నట్టిపోవఁగ నిక న్నామాట యేర్పెందుర
న్దాపమ్మద్ది దురాశయం చనవె నీ ధర్మమ్మునన్ బుద్ధుఁడా !

మ॥ ప్రతివాఁడొక్క కుటుంబమున్ నిలిపి దర్పంబు న్వెలింగింపఁగా
నతివేగమ్మునఁ గయ్యము ల్బెరిగి యాయాసమ్ముఁ గల్పింపవే?
సతియంచు న్సుతులంచు సంకుచిత సంసారమ్ము నిర్మించి ప
ల్వెతలం బొందఁగనేల! దుష్ఫలఁవే పీడందగు న్బుద్ధుఁడా!

శా॥ తుష్టిన్వీడి స్వయమ్ముగాఁ బ్రజలు సంతుష్టిం బ్రశంసించుచున్
"ఇష్టంబున్న పదార్థము న్నయితము న్వాంఛ్ఛనఁ జేపెక్కుదే?
కష్టంబు ల్వెసఁ దాటిపోవుటకునై కామంబుల న్వీడుడీ,
నష్టంబౌ సిల సర్వము"న్న నెద రజ్ఞానమ్మునన్ బుద్ధుఁడా!

ఉ॥ ఇష్టముగల్గినన్ భువిని యెక్కుడుగాఁ దినఁజాల రేరునున్;
గష్టము దాటఁ గోరుటయుఁ గామమె, దానిని వీడఁ గష్టమౌ;
నష్టము గాఁగఁ బోదిలను నామముదక్క నికేదియుం జుమీ;
తుష్టియుఁ దృష్ణయుం జనుల దుఃఖముఁ దీర్పఁగ లేవు బుద్ధుఁడా!

ఉ॥ పాపములన్నిఁ బోవిడిచి, భావమునన్ బరిశుద్ధుఁడైనచో
నాపదలంటలేవికను నర్హతుడం చన నోవు వానిఁ బో;
ఆపయిఁ బుణ్యమొక్కటియు యాతనికిందగు కార్యమౌటచేఁ
బ్రాపయినిల్చు దీనుల కుపాయము సెప్పుచు నెప్డు బుద్ధుఁడా!

ఉ॥ పాపముఁ జేయకుండుటయుఁ బాయకఁ బుణ్యముఁ జేయుచుంటయున్
గోపల ద్వేషమోహములు లోభమనంబడు చిన్నలంబులన్
దోపఁగనీకయుంచుటయు దుఃఖనివృత్తికి నీదుమార్గమౌఁ;
బాపముఁ బుణ్యమొక్కటనఁ బండిత మూర్ఖులుకారె బుద్ధుఁడా!

చ॥ రయమున వీడఁగావలయు రాజ్యము నేని యధర్మమైన దో,
భయమది లేదు తృష్ణయను భారము డించగ నంచుఁ బల్కవే!
నియమిత కర్మల స్వధువ నీతితొలంగకు నటంచు గీతలు
న్నియమముఁ జేయు; వానినిల నీమము సేయున దేదొ? బుద్ధుఁడా!

శా॥ గీతాగ్రంథ మనంగ సర్వలోకమే గీర్వాణముం జూపుచున్
'బాతాఖాని'ఁ గడంగి పల్కుదురు 'శాబాషం'చు నోరూరఁగన్;
బాతాళమ్మునుఁ ద్రవ్వియెత్తినగుఁ, దద్వైయర్థ్యము ల్దీర్పఁగా
జేతం గాదల బ్రహ్మకేనియనుచున్ జెప్పంగనే బుద్ధుఁడా!

శా॥ ధర్మవ్యాధుఁడనంగ నొక్కఁడిలఁ దా ధర్మంబు రక్షింపఁగాఁ
గర్మణ్యుండయి మాంసవృత్తికమునన్ గాలమ్ముఁ దాఁబుచ్చుచున్
"ధర్మంబన్న నిలంగిలట్టి యెవరిన్ దాఁ జంపకుండే సుమీ,
మర్మమ్మిద్ది" యటంచుఁ జెప్పె; నది నీమార్గంబె! నీ, బుద్ధుఁడా!

చ॥ తగవది కాసిపింపఁగనె ధారుణిఁ గొందరు చేరి పెద్దలై
తగవుకుఁ గారణమ్ముఁగని ధర్మముఁ జెప్పెడి దమ్ము లేక, నీ
తగవులె తప్పటంచు నొక దండుగ తీర్పు నిచ్చిపోవరే!
తగవులఁ జంపఁగల్గు నిల ధర్మము ధైర్యము, రెండె బుద్ధుఁడా!

ఉ॥ మార్పునుఁ బొందు నిజ్జగతి మారని దేది లభించునో కనన్
దూర్పుకుఁ బోవు వాని కిలఁ దోఁడగు నెట్టులు పశ్చిమంబు తా?
నార్పఁగఁ గోరి దుఃఖముల నాశ్రయమందఁ దపంబులన్ భళీ!
తీర్పఁగ దుర్లభంబులవి తీవ్రముగుం ద్విగుణమ్ము బుద్ధుఁడా!

ఉ॥ సర్వ మనిత్య మైనపుడు శాశ్వతమెట్లగు నాత్మ యిబ్భువిన్?
బర్వములన్ని పుచ్చు మరి పండునె యిక్షువనమ్ము తా, భళీ!
యుర్విని సర్వమున్ క్షణిక మూరక వాదము లేల? నెల్లరున్
గర్వము వీడి ధర్మమునుఁ గాంచదగున్ భువి వేగ బుద్ధుఁడా!

చ। క్షణిక మటంచు నీవన నశాశ్వతమం చిల శంకరుండు తా
వణిజులఁ బ్రోగుఁ జేసి గరువంబునఁ జెప్పడె? రాజు పల్కఁగన్
గణు; తిక భృత్యుడట్ల యనఁగల్గునె మూల్యము వీసమంత? తా
మఁణులు మతమ్ములు న్మరియు మాన్యముల న్సమకూర్ప బుద్ధుఁడా!

ఉ॥ సర్వ మనిత్యమంచు భువిఁజాటగ నీ వలనాడు, శంకరుం
డుర్వి యసత్యమంచుఁ గడు నుద్ధతిఁ బల్కెఁ; గజంబొకండు వేఁ
బర్విడిరాగఁ బారెచని, భ్రాంతిమునింగియు, లజ్జవీడి, తా
సర్వము మిథ్యయంచుఁ బగసాగడె వాద మికేల? బుద్ధుఁడా!

ఉ। దేహ మనాత్మ మంచు భువిఁ దెల్లముఁ జేయగ నీ, విక భళీ!
సోహమునంచు శంకరుడు శోకమయంబగు నీజ్జగంబుఁ దా
మోహమునందుముంచి కడు మోసము సేయడె! యాత్మసత్యమున్
దేహము మిథ్యయైనఁ గడతేరునె దుఃఖము మాను? బుద్ధుఁడా!

ఉ॥ దేహమువోలె నాత్మయునుఁ దీరు మనుండు క్షణాక్షణమ్ము; ద
న్మోహమున న్మునింగి యిక ముక్కను మూసుక సర్వకాలమున్
సోహమునంచు నెంచినను శోకము మాయునె? దుర్భ్రమమ్ము; సం
దేహమువీడి శోకఁదగు ధీరత నీదగు త్రోవ బుద్ధుఁడా!

మ॥ ఎఱుగంజాలరు మూఢమానవులు తామేమేమి యూహించినన్
దిరుగంజాలవు దుఃఖములే వెనుకకున్; క్రమ్ముగాఁ దాపము
లడఁగింపంగ నశక్తము; లోభమికలం గట్టి ద్రహింపంగ లే;
వరయం దృష్ణనుఁ గూల్చఁగాఁ దొలఁగునా దుఃఖము వ్యాసన్ బుద్ధుఁడా!

శా॥ తృష్ణాజన్మపరంపరం దునుముఁగా దృష్టి న్మరల్చందగున్;
తృష్ణాయంచు సదా భజించినను నా బుద్ధ్యాత్మ వీక్షించునే?
తృష్ణాంభావము వీడి యింక నెస నాదుఃఖంబుఁ బోఁ ద్రోలఁగన్
దృష్ణం జంపఁగఁ బూనుకొందు నిట సందృష్టిన్ గురూ! బుద్ధుఁడా!

చ॥ పరముగిరమ్ము లేదికను భావన సేయఁగ; ధర్మపూజయు
న్స్మరణయు నిష్ఫలమ్ములను మర్మమెఱింగి చరింతునింక నా
మరణము నీదు ధర్మమున; మానవజాతి సముద్ధరింప నేఁ
దిరముగ గాససేసి యిట దీక్షఁదగ న్వహియింతు బుద్ధుఁడా!

చ॥ గరువము వీడి కానఁగు గౌరవమొప్పఁగ నీదు ధర్మమున్;
బరువది తగ్గిపోదు భువి భారత భూమి కొకింతయు; న్నికన్
గర మభివృద్ధిఁ జెంది కడు గాఢమగున్; ధర నీదు కీర్తియే
వరమయి నేటికిందనను, వ్యాసుఁడు నీశుఁడుఁ గారు బుద్ధుఁడా!

